# వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి

# కధలు - రచనలు

1 dec 23 to **27-12-23**





తమాషాల రాజు గారు **27-12-23**

శ్రీ కృష్ణ దేవరాయల కి **36** వ తరపు ముని మనుమడిని - అని చెప్పుకునే రాజు ఒకరున్నారు . తమాషాకి అని అయన అట్లా చెప్పుకునే వాడు .
శ్రీ కృష్ణ దేవరాయలుతమాషాలు ప్రోత్సహించటం వల్లనే కదా , తెనాలి రామ లింగడు తమాషాలు చేసి చూపాడు ? ఈ తమాషాల వల్లేనే కదా వారిద్దరి పేర్లూ చరిత్రలో నిలిచిపోయినది ? నేను కూడా అట్లాగే ఏవో కొన్ని తమాషాలు చేసి నా పేరు చరిత్రలో నిలుపుకోవాలి ? అన్న ఆలోచన ఈ రాజుకు ఉండేది .
[]
ఒకనాడు ఒక దొంగ రాజు గారి కొలువుకు వచ్చి " అయ్యా -- ఒక శెట్టి గారి ఇంటికి కన్నం వేసుకొని లోపలి కి దూరబోతుండగా - గోడ కూలి కన్నము మూసుకు పోయి - అందులో చిక్కుకున్న నా కాలు విరిగింది . నా కాలు విరిగినందుకు మీరు ఏదన్నా నష్టపరిహారం ఇప్పించాలి " అన్నాడు .
" ఒక కన్నం తవ్వగానే గోడ కూలేటట్లు - ఒక ఓటి గోడ కట్టిన ఆ అసమర్ధపు తాపీ వాడిని పిలిపించండి " అని రాజుగారు అన్నాడు

వాడొచ్చి " అయ్యా ఈ దొంగ కన్నంవేసిన చోట గోడ కట్టినప్పుడు - ఒక వేశ్య అనేక సార్లు నాముందునుండీ వయ్యారంగా - అటూ ఇటూ తిరిగింది . ఆమె సోయగాలు చూస్తూ నా బుద్ధి వశం తప్పింది . ఆ మత్తులో ఆ కోస్తా గోడను ఎదో కట్టాను అంటే కట్టాను కానీ ధృడంగా కట్టినట్లు లేను " అన్నాడు

" అయితే ఆ వేశ్యను పట్టుకురండి " అని తమాషాల రాజు అన్నాడు
ఆమె వచ్చి " రాజా - ఈ గోడకు అనుకుని ఒకదారి వున్నది . ఆ దారి కుండా కంసాలి ఇంటికి వెళ్ళాను . అతడు నాకు చేసి ఇస్తాను అన్న నగ ఎంతకూ ఇవ్వక నన్ను అనేక మార్లు ఆయన ఇంటికి తిప్పుకున్నాడు . ఆ కంసాలి మూలంగా నేను తాపీ మేస్త్రీ కంటపడవల్సి వచ్చింది "

"అయితే ఆ కంసాలిని పట్టుకురండి " అని తమాషాల రాజు అన్నాడు .
కంసాలి వచ్చి " మా ఇంటిది పిల్లవాడిని పట్టించుకోక పోయినందున వాడు అదేపనిగా ఏడ్చాడు . వాడి ఏడుపుతో నేను పనిమీద ధ్రుష్టి కేంద్రీకరించి లేక పోయినాను . అందుకని ఈ వేశ్యను రెండు మూడు సార్లు

నా ఇంటికి రమ్మన వలసి వచ్చింది " అన్నాడు
" ఇప్పుడు వీడి ఇల్లాలును రప్పించండి "అని తమాషాల రాజు అన్నాడు .
ఆమె వచ్చి " అయ్యా మాకు ఒక కోడి పెట్ట వున్నది . అదిరోజూ , మా పొరుగున వున్నా బ్రాహ్మణుల ఇంటిలోకి దూరి అన్నం మెతుకుల కోసమని భూమిని కెలుకు తూ ఉంటది . దాన్ని వెనక్కు పిలుచుకో పొమ్మని ఆ బాపనయన నామీదకి తగాదాలకు వచ్చాడు . ఆయన కారణంగా నేను అటు పోయాను . నేను వాడిని వదిలి వెళ్ళాను అని పిల్లవాడు గుక్కపట్టి ఏడ్చాడు . ప్రతి నిత్యం మాకు ఇదే తగాదా. పిల్లవాడి ఏడుపుకు కారణమూనూ " అన్నది .

ఇప్పుడు మన తమాషాల రాజుగారు - వెళ్లి ఆ బ్రాహ్మణా ఆయనను ఈడ్చుకు రమ్మంటాడు" అని సభా సదులు అనుకున్నారు .

" బ్రాహ్మలు అంటే దేవతా స్వరూపులు - వారిని విచారించరాదు. అందువల్ల - ఓ భటులారా వెళ్లి ఆ కోడిని చంపి రాండీ " అనిచెప్పి రాజు ఆనాటికి కొలువు ముగించాడు .
[][]
ఆ మరునాడు ఒక మనిషి వచ్చి " అయ్యా నేను నిత్యమూ ఆలయ దర్శనము చేస్తాను . ఇవాళ మామూలు వేళకు దైవ దర్శనము కాలేదు . కారణం - బ్రాహ్మడు గుడి తలుపులు తెరవలేదు .
దైవ దర్శనం లేక నాకు మనస్తాపం కలిగింది . దేముడు కూడా మనస్తాపం చెందే ఉంటాడు. .మా మనస్తాపం పోగొట్టటానికి ఏదైనా చేయండి " అని అడిగాడు .

" దేమునికి మనస్తాపం తెప్పించిన వాడి ని పట్టుకు రండి" అని రాజు అన్నాడు , ఆలయ అర్చకుడైన బ్రాహ్మడు వచ్చి " అయ్యా నిన్న మీ భటులేవరో వచ్చి, మా పెరటిలో తిరుగుతున్న - పొరిగింటి వారి కోడిపెట్టను బాణాలతో కొట్టి చంపేశారు . శవం ఇంటిలో ఉండగా ఆలయం తెరువవచ్చా ? లేదా అనే సందిగ్ధం లో పడి- అలోచించి - చివరికి ఆ కోడిని ఊరి వెలుపలకు ఈడ్చి పారేయించి - ఆపై స్నానము చేసి గుడి తలుపులుతెరిచాను . ఈ ఆలస్యము వల్ల భక్తులు - వారితో పాటు నేను - నాతో పాటు దైవము-- ఇలా అందరమూ కూడా మనస్తాపము చెందాము " " అని విన్నవించాడు .
[][][]

" ఇది తిరిగి తిరిగి నా మెడకే చుట్టుకున్నదే" అని ఆలోచించిన తమాషాల రాజుగారు ---
దొంగచే కన్నం వేయబడ్డ ఇల్లుగల శెట్టి గారిని పిలిపించాడు " నువ్వు దొంగలకు ఆకర్షవంతగా కనపడేటట్లు ఇల్లు కట్టావు కాబట్టే కథ ఇంత వరకూ వచ్చింది . దేమునికి మనస్తాపము పోగొట్టటానికి అని, దేమునికి ఉత్సవాలు జరిపించి - ఊరి ప్రజలందరికీ విందు భోజనం పెట్టు . కాలు విరిగిన దొంగ చేతులు బాగానే వున్నవి కావున వాడి చేత గుడి పరిసరాలు ఊడ్పించి - వాడిచేతనే కూరలు అవీ తరిగించండి. మజ్జిగ చిలికించండి " అని రాజుగారు తీర్పు చెప్పారు.

విరిగిన కాలుతో, డేక్కుంటూ పాక్కుంటూ, పాక్కుంటూ డేక్కుంటూ-- దొంగ ఆలయ పరిసరములు అన్నీ చిమ్మి ఊరి వారి విందుకు కావాల్సిన స్థలము మరియూ మజ్జిగా సిద్ధము చేసాడు .దొంగ వ్యవహారము తమాషాగా ముగిసింది కదా అని ఊరి జనులు అనుకున్నారు . రాజునకు కావాల్సిందే ఆదికదా ? అయన తెగ సంతోషించాడు .
అయితే మొదటిలోనే " నేను దొంగవి - అని నీవే వప్పుకుంటున్నావు - కాబటికి నిన్ను బందిస్తూ వున్నాను " అని రాజు అనివుంటే ఈ తమాషా జరగకనే పోవును . తమాషా మనుషులు లేకపోతే తమాషా కథలు వుండవు -

ఈ తమాషా కథ మీకు చెపుతున్న వాడు-- వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి నుండి
—-------------------------------------------------------------------------------------
-----
మీరు ఎవరినైనా భయ పెట్టాలా ? **21-12-23**

మీరు అందరినీ భయ పెట్టాలి అనుకుంటున్నారా ? మీరు భర్తను భయ పెట్టాలి అనుకుంటున్నారా ? మీరు మొగవారు . . భార్యను భయ పెట్టాలి అనుకుంటుంన్నారా ? మీరు తండ్రి ?పిల్లలు నాకు భయపడటం లేదు అనుకుంటున్నారా ? మీరు ఒక స్కూల్ టీచర్ - పిల్లలని భయపెట్టి కంట్రోల్ లో ఉంచాలనుకుంటున్నారా ? మీరు ఎదుట వాళ్ళని తేలిగ్గా భయపెట్టేయటం ఎలాగో చెపుతాను చూడండి . ఇది మానసిక పురాణాలలో నుండి సేకరించాను .

రెండు సాంబ్రాణీ కడ్డీలు తీసుకోండి.వాటిని వెలిగించండి . వాటిచేత పొగలు కక్కించండి .పొగలు కక్కించటం ఎల్లాగూ అంటే వాటికి ఇంత కొబ్బరి నూనె పూయాలి . ఇహ మీరు ఆడవారు అయితే - వాటిని కొప్పులో పెట్టుకోండి . అదే మీరు మొగవారైతే చెవులలో పెట్టుకోండి . మీరు అటూ ఇటూ అంటే ఇంట్లోకి బయటికి తిరుగుతూ ఉంటే . మిమ్మలను చూసిన వారు అందరూ భయ పడతారు . కాదంటారా ?
ఉప సంహారము = పూర్వము మనకు కత్తి యుద్దాలు జరుగుతూ ఉండేవి కదా? .
చైనా లేదా జపాను దేశంలో కూడా ఈ కత్తి యుధ్ధాలు ఉండేవి. ఎవరైనా ఒక సేనాని యుధ్ధము సరిగా చేయలేదని భావించినప్పుడు రాజుగారు వాడిని పిలిచి త్రీవ్రంగా మందలించు తాడు కదా ?
అప్పుడు ఆ సేనాని అవమానము ఫీల్ అయ్యి " నేను రేపటి యుధ్ధములో శత్రువు తలలు నరికి తీసుకో వచ్చి మీకు సమర్పిస్తాను . లేదా నా తల సమర్పిస్తాను " అని భీషణ ప్రతిజ్ఞ చేసేవాడు . తాను ఆ ప్రతిజ్ఞలో వున్నాను అని ఇంట్లో వారికి వీధిలో వారికి మరియూ సైన్యములోని తోటి వారికీ - ఎదుట వారికీ చెప్పటానికి అని ఈ సేనాధి పతి కొన్ని సాంబ్రాణీ కడ్డీలను వెలిగించుకుని వాటిని తన తలపై దోపుకుని పొగలు కక్కుకుంటూ తిరిగేవాడు . అంటే " ప్రతీకారం తీర్చుకోవాలని న మనసు పొగలు కక్కుతోంది " అని చెప్పినట్లు . అంతే కాక శత్రు సైనికుల తో " ఇవాళ్టి యుధ్ధములో మీ తలో నా తలో ఎగిరి పోవాలి " అని కూడా చెప్పినట్లు .

ప్రాణానికి లెక్క చేయని సైనికుని ఎదుట ఎవరు నిలబడతారు ? చెప్పండి .

ఒక్కో సారి విధి వశాత్తు ఎదుటి పక్షంలో కూడా పొగలు కక్కే వారుంటే వీరిద్దరి మధ్య మాత్రమే యుద్ధము జరిగేది . చూచే వారికి కోడి పందెము చూస్తున్నట్లు ఒక వినోదము దొరికేది .
మీరు బాగా అలోచించి చూస్తే ఇదేమీ పనికి మాలిన విషయము కాదు - అని అలోచించి మీకు తెలియ పరిచిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ - అమరావతి .
—-------------------------------------------------------------------------------------------
------

మా ఆయన ఎవరు ? 21-12-23

మల్లికా - అనే ఈ అమ్మాయి కాపురం ఉండేది ఒక పెద్ద పల్లెటూరు .నేడు ఆమె మొదటి వివాహ వార్షికోత్సవం వచ్చింది . అప్పుడు ఆమెతన భర్త రాంబాబుతో "

ఏమండీ ఇవాళ రాత్రి థియటర్కి వెళ్లి సినిమాచూసి వస్తూ వస్తూ మంచి డిన్నర్ చేసివద్దాము . మన ఊరి థియాటర్లోకి ఏదో మంచి ప్రేమకథా చిత్రం వచ్చిందిట . చూసొద్దాము . మీరు మాత్రం  మిస్ కొట్టకుండా పెందలాడే ఇంటికి రండి " అన్నది . ఆపై  అతని గడ్డము పట్టుకొని మరీ బ్రతిమాలింది .

మల్లిక అలా భర్త ను బ్రతిమాలాటానికి ఒక కారణము వుంది . మల్లికకు లవ్వు స్టోరీ సినిమాలు అంటేచాలా  ఇష్టము . ఆమె భర్త రాంబాబు అందుకు పూర్తి వ్యతిరేకం . అతనికి- హర్రర్   టెర్రర్ కిల్లర్ - టెర్మినేటర్ లాంటి సినిమాలు అంటే చాలా  ఇష్టము . అతనికి ఏ సినిమాలోనైనా నాలుగు మర్డర్లు - వంద  లీటర్ల  రక్త  పాతము   వంద సుమో ఎగురుళ్లు ఉండాలి . అన్నం లోకి ఆవకాయ - అందులోకి పచ్చి మిరపకాయ, ఉప్పు మెరపకాయా ,  కావలి అన్నట్లు.  ఇద్దరి అభిరుచులు కలవనందున - ఈ సంవత్సరంలో వారిద్దరూ కలిసి చూసిన సినిమా అనేదే లేదు - అదీ నేపధ్యము . ఆరాత్రి ఈ భార్య భర్తలు ఇద్దరు కలిసి సినిమాకి వెళ్లారు . అది సగటు తెలుగు సినిమా.
హీరోయిన్ అనేక డ్రెస్సులు వేసి హీరోని కవ్వించింది. హీరో కూడా ప్రంచములోని అన్ని రకాల డాన్సులు ఆమె ముందుఆది  ఆమె మనస్సును రంజింప చేసాడు . హీరో ఇన్ తండ్రిని
తన్ని తొడపాశం పెట్టి మరీ హీరో హీరోయిన్ ను పెళ్లి చేసుకున్నాడు హీరో . వారి ఫస్ట్ నైట్ ఎంతో
మెమొరబుల్ గా వుండాలని - కాకులు దూరని కారడవి - చీమలు దూరని చిట్టడవి మధ్యలో ఉన్న కొండా - అందులో వున్నా గుహ,  ఆ గుహలో వున్నా సెలయేరు దానిపక్కనే వున్నా ఇసుక దిబ్బల మీద ప్లాన్ చేసుకున్నారు . హీరో తన స్టేటస్ కి తగ్గట్లు ఒక హెలీకాప్టర్ రప్పించి అందులో భార్యను కూచో పెట్టుకొని ఆ ఇసుక మీద దిగుతాడు . వీరుదిగి అందుకోసం ప్రిపేర్ అవుతుండగా - గుహలోనుండి నలుగురు ఆది మానవులు వస్తారు . వారు హీరో ఇన్ ను బందించి- మంత్రాలు చదువుతూ  - ఆమె సజీవంగా ఉండగానే ఒక పెద్ద నిప్పుల కుంపటి మీద వేసి కాలుస్తారు . పోలిక చెప్పాలంటే కుంపటిలో  మొక్క జొన్న కండెనుపెట్టి కాల్చినట్లు కాలుస్తారు . ఆతరువాత మొక్క జొన్న కండెను పళ్లతో పీక్కుని తిన్నట్లు హీరొయిన్ కాళ్ళు చేతులు పొట్టా తొడలు పీక్కు తినేస్తారు . హీరో ఇన్ చేసే ఆర్త నాదాలు విని  - ఆ భయానక దృశ్యాలు , తమ మూతికి అంటిన నెత్తురును నాలికతో అద్దుకుంటున్న ఆ

ఆటవిక  మానవుల ఆనందాన్ని చూసి మల్లికకు మూర్ఛవచ్చినంత పనైంది . ఈ దృశ్యాలు చూడలేక చాలా మంది థియటర్ వదిలి వెళ్లిపోయారు
మల్లిక  భర్త  చేతిని ఊతంగా బిగించి పట్టుకొని " వెళ్లి పోదాము పదండి . నామూడు అంతా చెడిపోయింది - తల తిరుగుతున్నది " అని అతన్ని  ఇంటికి మళ్లించింది .
రాంబాబుకు మాత్రం సినిమాకి క్లైమాక్ పడకుండా ఇంటికి రావటం ఇష్టం లేక పోయింది అయినా కానీ ఇంటికి మళ్లాడు.    .
దారిలో మల్లిక అడిగింది " ఏమిటండీ ఆ సినిమా అట్లా గుంది  ??" అని .
" ఎట్లాగో ఉండటం ఏమిటి ? నేను కోరుకున్నట్లే  వున్నది " . ఆ హీరో ఇన్ ఒక దుష్ట సెక్తి . మన హీరో దుష్ట శేక్తులనుండీ లోకాన్ని రక్షించే వాడు  . హీరో కావాలనే హీరో ఇన్ ని ఆకర్షించి ఒకప్లాన్ ప్రకారం ఆమెను ఆటవికులు ఆహారంగా చేసిఆ  దుష్ట సెక్తిని అంత మొందిస్తాడు .ఆటవికులు చదివే మోటు మంత్రాలకు గానీ ఈ దుష్ట సెక్తి కట్టు బడదు. అందువల్ల ఎన్నో అసలు పెట్టి ఆమెను కొండల్లోకి తీసుకు వస్తాడు - అదీ కథ." అన్నాడు
మల్లిక - మూడు రోజుల పాటు మూసిన కండ్లు తెరవకుండా పడివుంది . ఆ తరువాత సినిమా ఎఫెక్ట్ నుండి తెప్పరిల్లింది . అట్లా బయటికి వచ్చింది .
మల్లికను  పక్క ఇంటి ఆమె పేరు హేమలత పలకరించింది . " ఏమిటీ మీరు మూడు రోజులుగా బయటకు కనపడలేదు . వివాహ వార్షికోత్సవం సందర్భంగా ఇంట్లోనే ఫుల్ గానా బజానానా ? అని చిలిపిగా అడిగింది .
మల్లిక సినిమా సంగతి అంతా చెప్పి  " ఎదో సినిమాలే అని నాకు నేను సర్ది చెప్పుకొని ఇవాళే  మూర్ఛ నుండి  లేచాను " అని కూడా అన్నది .
హేమలత కళ్ళు ఇంతవి చేసి "నిన్న నే  ఆ సినిమా నేనూ చూసాను . కానీ సినిమాలో ఆలాంటి దృశ్యాలు లేనే లేవు . ఆ ఆటవికులు వీరిని తమ రాజు రాణిగా చేసుకొని కోట్ల విలువైన వజ్రాల గనులను వీరికి  కానుకలుగా ఇస్తారు . ఆ సంపదతో హీరో హీరో ఇన్ కు స్విట్జర్ లాండులో పెద్ద బంగ్లా కట్టించి - పిల్లలు పుట్టించి ఆమెను ఎంతో సుఖ పెడతాడు - చాలా లవ్వు చూపిస్తాడు " హీరొయిన్ ను   బోయింగ్ విమానాల్లో తిప్పేస్తాడు  " అన్నది  .
మల్లిక నమ్మలేదు . ఆరోజు తనతో పాటు సినిమాకి వచ్చిన ఒకరిద్దరిని గుర్తు చేసుకొని వారి ఇండ్లకు వెళ్లి వాళ్ళను వాకబు చేసింది . వాళ్ళు మాత్రం సినిమాలో ని ఆటవికులు, హీరోఇన్ ను పీక్కో తినే దృశ్యము వున్నదని అది పరమ భయంకరంగా వున్నది - చూడలేక మేము పారిపోయి వచ్చాము అని చెప్పారు .

అప్పుడు మల్లిక చెవిలో "సినిమా ఎట్లాగో ఉండటం ఏమిటి ? నేను కోరుకున్నట్లే వున్నది" అని తన భర్త అన్న మాటలు తిరిగి తిరిగి ప్రతిధ్వనించాయి .

" ఓ సినిమా ను తనకు కావాల్సినట్లు - తాను కోరుకున్నట్లు మార్చుకోగలిగిన - మా ఆయన ఎవరు ? దేముడా ? దయ్యమా ?? " అనుకుంటూ మల్లిక ఇంటికి చేరింది .

సస్పెన్స్ థ్రిల్లర్ కథను రాద్దాము అని - వారణాసి శ్రీ రామ కృష్ణ- అమరావతి రాసిన స్వంత రచన -- బై అండీ ..
—---------------------------------------------------------------------------------------

ఘంటాలమ్మ చెట్టు **20-12-23**

మావూరు అమరావతి . అమరేశ్వరుడు కొలువైన అమరావతి . మావూరిలో ఘంటాలమ్మ చెట్టు అని ఒకటి వున్నది . అది నేటికినీ వున్నది . నా చిన్నతనపు కధల ప్రకారాము - మావూరి పొలిమేరలలో ఉన్న పోలేరమ్మ తల్లి మారు పేరే ఘంటాలమ్మ . - ఆ విడ రాత్రిళ్ళు వచ్చి ఈ మర్రి చెట్టు కింద కూచుని, . చెట్టు ఆకులను గంటల లాగా లేదా గజ్జెల లాగా మోగించేది , దీనికి స్పందనగా అమరేశ్వరాలయములోనుండి తిరుగు గంటల చప్పుడు వినిపించేది . ఈ రకంగా మా పొలిమేర దేవత ఘంటలమ్మా- మా పరమేశ్వరుడూ గంటల ద్వారా సంభాషించుకునే వారుట . దీన్ని బట్టే ,అష్టావధానాలు శతావధానాల లాగా - ఘంటావధానాలు కూడా వచ్చేయని - కానీ పోయాయని మా తెలుగు మాస్టారు అన్నారు . మాస్టారు గారు అన్నారు కాబట్టి - మేము గట్టిగా నమ్మాము .

సరే వాళ్ళేమి మాట్లాడుకున్నా మనకేమిటి కానీ - మనము పోయి ఏమిటీ ఈ గంటల శబ్దము ? అని సందేహముగా పైకి చూసినచో - చూచిన వాళ్ళ తల వేయి వక్కచెక్కలవుతుందన్న శాపము వున్నదని నాకు తెలిసింది. , అందువల్ల పట్టపగలు కూడా నేను ఆ చెట్టుకిందనుండి వినయ విధేయతతోతలవంచుకొని నడిచేవాడిని , నాకు అంత భయము ఆ చెట్టు అంటేను .

ఇంత భయస్తుడినైనా నాకు ఒక సారి ఒక విషమ పరీక్ష ఎదురైంది , నేను టెన్త్ పబ్లిక్ పరీక్షలు రాస్తూ వున్నాను . ఇంగిలీషు పరీక్ష రేపే అనగా నాకు వణుకు మొదలైంది . అప్పుడు మాసీనియర్ విద్యార్థి ఒకడు కనిపించి - " రాత్రి గంటాలమ్మ చెట్టుకి వెళ్లు- అక్కడ లీకైన కొశ్చన్ పేపర్ దొరుకుతుంది , దాన్లో కొచ్చన్లు మరునాటి ఎగ్జాములో లో వస్తవి" అన్నాడు .

నేను గుండె చిక్క పట్టుకొని ఘంటాలమ్మ చెట్టు వద్దకు వెళ్ళాను . అక్కడ నాలాగా నలభై మంది వున్నారు . నిజంగానే ఒక కొచ్చెన్ పేపర్ { చేతితో రాసినది } అటూ ఇటూ చేతులు మారుతున్నది . నేను ఎట్లాగోట్లాగా ఆరు కొచ్చెన్లు గుర్తుకు పెట్టుకొని -వచ్చి - ఆ రాత్రికి రాత్రే వాటికి ఆన్సర్లు బట్టీ పట్టేసి, మర్నాడు ఎగ్జాముకి వెళ్ళాను . నిజంగానే నాలుగు కొచ్చెన్లు తగిలినవి . అట్లా నేను ఇంగిలీషు గట్టెక్కి ఇంటర్లోకి పడ్డాను .

నేను డిగ్రీ పూర్తి చేసే సంవత్సరంలో, ఎందుకో గుబులేసి - ఇప్పుడు మన ఘంటాలమ్మ చెట్టుకింద పరిస్థితి ఎలావుందో చూద్దామని అటు వెళ్ళాను. కొందరు పిల్లలు వున్నారు . వారితో మాట్లాడాను . వాళ్ళేమన్నారంటే ' కొచ్చన్ పేపర్ లీక్ కాదు-- ఏమీ కాదు . మాకు ప్రైవేట్లు చెప్పే మాస్టారులు - ఇవిగో ఈ ఇంపార్టెంట్ కొచ్చన్లు చదువుకోండి - అని - పాత పేపర్ల మోడల్ లో కొన్ని ప్రశ్నలు రాసి ఇస్తారు . వాటిలో కొన్ని పరీక్షలో తగులుతవి . అదే పేపర్ లీక్ అంటే " అని చెప్పారు . అంటే అవి -నిజంగా లీకైన పేపర్లతో కాలము చెడిపోని రోజులు .

ఉద్యోగము చేస్తూ వున్న రోజుల్లో ఒక సారి మా అమరావతి వచ్చాను . రేపే టెన్త్ పరీక్షలు మొదలు అని ఎవరో అన్నారు . నేను మళ్ళా ఘంటాలమ్మ చెట్టు వద్దకు పోయినాను . ఈ తడవ అక్కడ వున్న విద్యార్థుల ద్వారా తెలుసుకున్నదేమిటంటే - ఇప్పుడు ఒకే సబ్జెక్టు మీద రెండు మూడు కొశ్చన్ పేపర్లు లీక్ అవుతున్నవి . ప్రేవేట్లు చెప్పటంలో పోటీ పడే ముగ్గురు మాస్టార్లు థలా ఒక కొచ్చెన్ పేపర్లు రాసి లీక్ చేస్తున్నారు . అన్నింటిలో కామన్ గా వున్నా ప్రెశ్నలేవో వాటిని విద్యార్థులు చదువుకుంటూ వున్నారు.

యాహూ .. ఏమీ ఉపయోగం లేకుండానే ఈ ప్రైవేట్ మాస్టర్లు ఈ కొచ్చన్ పేపర్లు లీక్ చేస్తున్నారా ? అని ఆలోచిస్తే - తెలిసింది ఏమిటంటే " ఏ ప్రైవేట్ మాస్టారు అయితే రేపు జరగపోయే నిజం ఎగ్జామ్ లోని కొచ్చెన్లని " చక్కగా గెస్ చేసి దాన్ని లీక్ చేస్తాడో - అయన దెగ్గరే ఎక్కువమంది తొమ్మిదో తరగతి విద్యార్థులు రేపటి నుండీ టెన్త్ ప్రైవేట్ చదువు తారు అని .

ఘంటలమ్మ చెట్టు గంటల సెబ్దము ఏమిటో తెలుసుకోవాలన్న పరి శోధనా ద్రుష్టి నాకెన్నడూ

కలగలేదు . కానీ ఒకనాడు దాని మర్మము కూడా విడి పోయింది .

ఘంటాలమ్మ చెట్టుకింద ఒ కోమటికి పచారీ దుకాణము వుంది . ఆయన ఒక పిల్లిని పెంచేవాడు పిల్లి పగలు షాపులో తిరుగుతూ షాప్ లోకి దూరబోయే ఎలుకలను దూరము ఉంచేది .

అదే కొమటాయన అదే పిల్లికి , రాత్రి వేళా , ఎవరూ చూడకుండా దాని మేడలో గజ్జెలు కానీ గంటలు కానీ, ఎదో ఒకటి కట్టి చెట్టుమీదకు వదిలేవాడు . అది ఉడుతలను వేటాడుతూ ఆ కొమ్మా ఈ కొమ్మా దూకుతుండేది . ఆ సెబ్దమే ఘంటాలమ్మ సెబ్దము . ఈ శబ్దానికి దడిచి - దొంగలు తన కొట్టుకి కన్నము వేయకుండా ఉంటారని అయన ఆలోచన . భయపెట్టే ఈ ఘంటాలమ్మ చెట్టుకింద ఆ రోజులనాటి మా కొచ్చెన్ పేపర్లలీకు తతంగం సాగుతుండేది. ఇప్పుడెట్లా ఉందొ చూద్దామని మొన్నొక సారి వెళ్ళాను . చెట్టు వుంది . ఎవరో గానీ భక్తి భావముతో దానిని పైనుండి క్రింది దాకా కరెంట్ లైట్లతో అలంకరించి పెట్టారు .

—----------------------------------------------------------------------------------

-1

బర్రెను/ బుర్రను పెంచుకోవాలే . **19-12-23**

ఇంటికి పాలు తెచ్చి పోసే పుల్లన్న తో ఇట్లా అన్నాను .ఇక ఆగలేకనే అన్నాను .

" ఏమోయి నీ పాలల్లో నీళ్లు ఎక్కువగా వున్నవి, ఏమిటి ? నీ ఖాతా మానేసుకోమంటావా ? " అని

" అలాగేమీ వుండదండీ .. మా పాలల్లో నీళ్లు ఎన్ని ఉండాలో అన్నే ఉంటవి . మీరు నామీదా , నాపాల మీద నమ్మకము వుంచాలే " అని అతడు అన్నాడు

" ఏమిటి నమ్మకము ?" అని నేను అన్నాను .

ఆ మరునాడు అతడు పాలతో పాటు ఒక కాగితము కూడా పట్టుకు వచ్చాడు . అది చదివాను . పుల్లన్న బఱ్ఱె గురించి ఎవరో పెటర్నరీ డాక్టర్ గారు ఇచ్చిన సర్టిఫికెట్ అది . అందులో " ఈ గేదె " ముంబా " జాతికి చెందిన హర్యానాగేదె . ఇది నమ్మకముగా రోజుకు ఇరవై లీటర్లపాలు - 66 % శాతము వెన్న తో ఇవ్వగలదు . ఈ పశువును కొనుట కొరకై లోను మంజూరు చేయవచ్చును "

" ఈ సెర్టిఫికట్ ను చూసి అయినా మా బఱ్ఱె పాలను నమ్మండి " అని మా పుల్లాయి అన్నాడు .

" అది నమ్మకమైన పాలనే ఇచ్చును గాక . నీవు నీళ్లు కలపవని ఏమి గారెంటీ ?" అని నేను అడిగాను .

ఆ మరునాడు అతడు ఇంకో సర్టిఫికెట్ తెచ్చాడు . ఒక ఆఫీసర్ గారెవరో దాన్ని ఇచ్చారు .దానిలో

" పుల్లయ్య అను ఈ రైతు నీతీ , నిజాయతీ కలిగిన వాడు . నమ్మకమైన వాడు . ఇతని నీతి నిజాయితీలు నమ్మి -- ఇతనికి " ముంబా " జాతికి చెందిన హర్యానాగేదె కొనుటకు కావాల్సిన వ్యవసాయ ఆధారిత ఋణము ఇవ్వవచ్చును " అని వుంది .

అది నేను చదివి పుల్లయ్య వంక సోచాయింపుగా చూసినాక అతడు నాతో ఇట్లా అన్నాడు " మా గేదె నమ్మక మైన పాలు ఇచ్చును అని , నేను నమ్మ దిగిన రైతుని అని గోవర్నమెంట్ వాళ్ళిచ్చిన సర్టిఫికెట్ ఉండనే వున్నది .కనుక మీరు మా పాలమీద నమ్మకం తో ఉండాలి .నమ్మకం తో వోయించుకోవాలి . నమ్మకం గా మా పైసలు మాకు పారెయ్యలే " అన్నాడు .

"నువ్వు ఎన్ని చెప్పినా కానీ నాకు ఎదో తేడా కొడుతూ నే వున్నది " అని నేను అన్నాను .

అతడు ఇట్లా బదులిచ్చాడు " శారూ ఎదో తేడా తడుతూనే వున్నా కూడా మనము ఒక్కో సారి నమ్మకము తోనే పనులు చేసుకొని పోతున్నామా లేదా ?" .ఉదాహరణకు జెనెరల్ ఇన్సురెన్సువాళ్ళు , యూనిట్లవాళ్ళు , ఇన్వెస్ట్మెంట్ ప్లాన్ల వాళ్ళు ,రియల్ ఎస్టేట్లవాళ్ళు , మనీ స్కీం వాళ్ళు---- పాలు+ నీళ్లు పాలు కలిసి

నట్లు  అనేక  రూల్సు / వాక్యాలుకలిపి మనకు అంతకడుతూ వుంటారు .  . ఇందులో " పాలు " అంటే మనకు ఎదో  లబ్ది చేకూరుతుంది  అని ఆశపెట్టే మాటలు  - ఇవి పెద్ద పెద్ద అక్షరాలతో ప్రస్ఫుటము గా ఉంటవి .  .ఇక "నీళ్లు " అంటే అవతలి వారికి  వారికి లబ్ది చేకూర్చి పెట్టే మాటలు . ఇవిచదవాలి అని అనిపించనంత చిన్న చిన్న అక్షరాలలో ఉంటవి  .  . వున్నా మొత్తము మాటలలో   లో ఇవ్వే అంటే ఈ నీళ్ళే మూడు వంతులు  ఉంటవి.  అలాంటి  పాలకోసమని  మీరు  ముందూ వెనకా చూడకుండా లక్షలు పెట్టుబడి పెడుతున్నారు కదా ? . అక్కడలేని  సందేహాలు, ఇక్కడెందు  కండీ ? అక్కడ  చూపించిన నమ్మకంలో కొంచెం  ఇక్కడ చూపించి ఈ పాలు పోయించుకోండి బాగు పడతారు .. లేదా ఇక్కడ వచ్చిన అనుమానాలే అక్కడ చూపించండి బ్రతికి పోతారు   --  కానీ మమ్మల్నేదో అని , మిమ్మల్ని మేమేదో దోచుకు తింటున్నామని ఆక్షేపణ చేస్తా  మీరు బాగుపడేది ఏమీ వుండదండీ  " అన్నాడు

పేపర్లో వేశారనో  , టీవీ లో చూపించారనో, ఎవరో చెప్పారు అనో ,    నమ్మకంతో ఏవేవోకొని ,పెద్ద పెద్ద మొత్తలు పెట్టుబడిగా పెట్టి  పోగొట్టుగా  లేనిది - ఈ పుల్లన్న మీద నమ్మకంతో పాలు కోంటే పోగొట్టుకొనేది  ఎంతా   ?  అని నాలో  నేను తర్కించుకున్నాను .

" కొన్ని  పేపర్ ప్రకటనల లో  , టీవీ ప్రకటనలలో ఎంత నిజము వున్నదో - వీడి సెర్టిఫికెట్ల లో గూడా అంతే నిజము వున్నది - కాబట్టి ఆ విధాన వీడిని నమ్మి ముందుకు సాగుదాము  అనుకున్నాను   " సరే నువ్వు నమ్మకంగా  పాలు పోయి. మేము నమ్మకంతో కొనుక్కుంటాము . కానీ మా పెట్టుబడుల జోలీ నీకెందుకు  " అని నేను పుల్లయ్యను విదిలించి    పంపి వేసాను.

నా విదిలింపులకు వాడు జామకాకుండా "సరే నమ్మకంతో కాకుండా యదార్థాన్ని పట్టి పనులు జరగాలంటే --

పాలకోసము అయితే బర్రెను పెంచుకోవాలే .

లాభము కోసము అయితే బుర్రను పెంచుకోవాలే " అని చెప్పి నా మొహం వంక తీక్షణంగా చూసాడు .

—--------------------------------------------------------------------------------------------
---.

దిబ్యాంకు అఫ్ అమరావతి **17-12-23**

నేను నా తోడల్లుడూ ఇద్దరమూ కూడాను బ్యాంకు ఉద్యోగులమే . ఇద్దరమూ కూడా అమరావతిలో వున్న రెండు ప్రముఖ బ్యాంకులలో పనిచేసి రిటైరు అయినాము . ఖర్చులు కలిసి వస్తాయని ఒకటే ఇల్లు అద్దెకు తీసుకొని అందులో రెండు కుటుంబాల వారము ఉంటున్నాము . ఈ రకంగా ఇంటిలోని ఆడవారికి ఎంతో కాలక్షేపముదొరికింది . మాకే ఏమీ కాలక్షేపము లేక పోయింది. అందు వల్ల ఒకసారి మేము ఇట్లా అనుకున్నాము " దీని తస్సా దియ్యా .. మన రిటైర్మెంట్ తరువాత మనకు కాలక్షేపము ఏమీనూ లేకుండా పోయింది .మనము కూడా ఒక బ్యాంకు పెట్టుకుందాము . బ్యాంకు అనగా ఏమిటంటే వచ్చే లాభ నష్టాలతో పనిలేకుండా జనానికి రుణాలు ఇచ్చి , ఇవ్వటం లోని మాజాని అనుభవించి చివరికి తాను దివాళా తీసేదే బ్యాంకు అంటేనూ "అని మేము ఒక నిర్ణయానికి వచ్చాము .
పై సూత్రాన్ని అనుసరించి మా ఊరైన అమరావతిలో -- ఎవరినుండీ ఎటువంటి అనుమతి పొందవలసిన అవసరం లేనట్టు వంటి ఓ బ్యాంకు తెరుద్దామని - నిర్ణయించాము .
మేము లోను ఇస్తాము - తీసుకునే వాళ్లు వస్తారు .మేము వాళ్ళకి ఏమేమో కొచ్చన్లు వేస్తాము .
యా అల్లా .. అట్లాగే మాకు ఎదో కాలక్షేపం అయిపోతుంది . లోను తీసుకున్న వాళ్ళనుండి
తిరిగి రాబట్టటం మా పాలసీ కాదు . ఎగ్గొట్టటానికి వీలు లేని కోసం ఎవరూ రారు కదా ? అని డిసైడ్ అయి పోయి -- మన కాల్సక్షేపం కోసం అని మనము నష్టపోయినా పరవాలేదు అన్న ధోరణితో తో మేము బ్యాంకు తెరిచాము .
బ్యాంకు అంటే అట్టే ఏమీ లేదు . మా వీధి గది కి ఒక కిటికీ ఉంటే - దాన్ని అటూ ఇటూ మార్పించి , బోర్లించిన పొత్రము ఆకారములో కన్నము

ఒకటి పొడిపించాము . ఆ రంధ్రము చూస్తేనే చాలు అర్ధం అయిపోతుంది . ఇక్కడేదో డబ్బు ఇస్తారు పుచ్చుకుంటారు అని .
ఆలా పై కన్నము తోని మేముబ్యాంకు స్టార్ట్ చేసాము .పేరు డాబుగా వుండాలని అలోచించి , బ్యాంకు అఫ్ అమెరికా లాగా బ్యాంకు అఫ్ అమరావతీ అని దానికి బోర్డు పెట్టాము .బోర్డు అంటే ఎదో కాదు . ఆడవారు పెట్టుకునే తిలకం బుడ్డిని వాడి మా కిటికీ మీద ది బ్యాంకు అఫ్ అమరావతి అని రాసి న కాగితము అతికించి పెట్టాము .
ప్రజలే వచ్చి ఇదేమి బ్యాంకు అండి ? అని అడిగారు . మేము ఇస్తామన్న చిన్న చిన్న లోన్లు అవీ చూసి - మాది మంచి స్టాఫ్ వున్న బ్యాంకు అని వారే అన్నారు ,

మా బ్యాంకు చేసే కార్యకలాపాలు - ముఖ్యముగా మాకు లాభము రాక పోయినా సరే -- మాకు కాలక్షేపము కోసము అని చేసిన పనులు కొన్ని వున్నవి .వాటిలో కొన్ని పనులగురించి చెపుతాను వినండి.

ఒకటీ -- గాజుల మీద ఋణము- షాపుల ముందు ను,.మార్కెట్ యార్డులలోను చిమ్మే సుబ్బాము అనే ఆమె వచ్చి చీపురు మరియు చీపురు కర్రా కొనుక్కొనుటకు ఒక లోను అడిగింది . మేము ఆమెను తరచీ తరచీ ప్రశ్నించీ - ఆమె గాజులు పెట్టుకొని మూడు వందల ఋణము ఇచ్చాము .ఆమె గాజులు ప్లాస్టిక్ వి . అందు వల్ల లోను తిరిగి రాక పోతే మేము ఏమి చేయాలి అన్న దాని మీద మా తోడల్లుళ్ళము చేర్చించుకుంటూ చాలానే కాలక్షేపము చేసాము .ఇలాంటి ఋణాలు ఎన్నో వున్నవి .

రొండు - చిల్లర ఋణాలు - పిల్లలు బడికి వెడుతూ ఉంటే - తల్లులు ఆ పిల్లల చేతిలో ఐదో ఫదో పెట్టి పంపుతూ వుంటారు . ఒక్కో సారి తల్లుల దెగ్గర పెద్ద నోట్లు ఉంటాయి అసలు డబ్బులే వుండవు అనుకోండి .మరి పిల్లలేమో చేతిలో డబ్బులు పడందే బడికి బయలు దేరరు . అందుకని ఈ

అవసరం నిమిత్తము మేము తల్లులకుచిల్లర డబ్బులు రుణముగా సమకూర్చాము . వారి దెగ్గర పెద్ద నోటు ఉంటే చిల్లర ఇస్తాము . అసలు చేతిలో ఏమీ లేదండీ అంటే మావద్ద వున్నా చిల్లరనే వారికి రుణంగా ఇస్తాము . రోజుకు పది చొప్పున ఇవ్వటం అనేది ఈ రుణాలకు లిమిట్ . తీసుకున్న వారే హామీ . వారే ఎప్పుడో వున్నప్పుడు ఒక వంద మా చేతిలో పెట్టి మా ఋణం మాఫీ అయ్యిందీ ? అని అడుగుతారు . వారి లెక్క డొక్కా చూసి వారి ఋణం మాఫీ చేయటం మాకు పెద్ద పని మరియు పెద్ద కాలక్షేపం అయ్యింది .

మూడు --ఫిక్సెడ్ డిపాజిట్ స్కీం - ఒక నాడు ఒకరు వచ్చి ఓ ఐదు వందలు ఫిక్సెడ్ డిపాజిట్ చేస్తాము అన్నారు . బ్యాంకు అన్నాక ఫిక్సెడ్ డిపాజిట్ లు లేకుండా ఎట్లాగా ? దాని మీద వడ్డీ అనేది ఎదో ఒకటి ఇవ్వకుండా ఎట్లాగా ? అందుకని మేము ఆ ఐదు వందలూ తీసుకొని - ఒక పది రూపాయల నోటు మీద " రిసీవుడు - **500** - ఫిక్సెడ్ డిపాజిట్ విత్ వన్ రూపీ ఇంటరెస్ట్ - ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమెరికా " అని రాసి వారికిచ్చి ఇట్లా చెప్పాము - " ఇక ఈ పది రూపాయల నోటు ఎక్కడా చెల్లదు. కానీ దాన్ని భద్రం గా పెట్టుకొని - తిరిగి మాకు ఇచ్చి వేస్తే మీకు **501** రొప్పయాలు ఇస్తాము" . ఇలాంటి ఫిక్సెడ్ డిపోసిట్స్ ఎన్నో వచ్చినవి . ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి "అని రాసి సంతకము పెడుతూ ఉంటే వళ్ళు పులక రించేది . అందుకోసమే వందలాది ఫిక్సెడ్ డిపాసిట్లు సేకరించాము .

నాలుగు - ఓవర్ డ్రాఫ్ట్ స్కీం -- మా ఇంటి పక్కనే ఓ కిరాణా దుకాణం ఉంటే వాడితో మాట్లాడి నాము . మా ఒప్పందం ప్రకారం ఆ షాపు వాడు ఎవరికన్నా సరుకులు అప్పు ఇవ్వవలిసి వస్తే , ఆ అరువు అడుగుతున్న వారిని మా వద్దకు పంపుతాడు . మేము ఒక పది రూపాయల నోటు మీద " వన్ హండ్రెడ్ రూపీస్ ఓవర్ డ్రాఫ్ట్ సాంక్షన్డ్ -- ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి "అని రాసి సంతకము పెట్టి వాళ్ళకిచ్చి మా ఒళ్ళు పులకరింప చేసుకునే వాళ్ళము .

ఈ రకంగా షాప్ వాడు అరువు మీద ఇచ్చిన సరుకులకు మేము హామీ పడ్డాము కదా ? .సరుకులు తీసుకున్న వాళ్ళు అప్పు కట్టక పోతే మేము కట్టాము -- మేము పూచీ పడ్డాము కాబట్టి - ఇందులో నష్టము వచ్చిందా ? లాభము వచ్చిందా అని లెక్కలు చూసుకోవటంలో మాకు బోలెడు కాల క్షేపము దొరికింది . మొత్తము మీద ఇప్పటికీ మా సంతకాలకుచెల్లుబడి వున్నది అని సంతోషించాము .

ఐదు - కిడ్డీ స్కీం - చిన్న పిల్లలు లేక్స్ పొటాటో చిప్స్ తెగ నములుతూ వుంటారు కదా ? దానితో వారికొచ్చే రోగాలు అనేకము . అందుకని మేము ఒక స్కీం పెట్టాము . మాకూ సమాజం పట్ల భాద్యత వుంది కదా ? ఏ పిల్ల లేదా పిల్ల వాడైనా సరే, మా దెగ్గర ఒక లేక్స్ పొటాటో చిప్స్ ప్యాకెటు డిపాజిట్ చేస్తే ఒక వారము తరువాత అతనికి ఒక బెల్లము పప్పుండ ఇస్తాము . ఇక ఆ చిప్స్ బ్యాంకు వారు జప్తు చేసుకొని - టీ తాగుతూ తినేస్తారు .. ఇదీ మా కిడ్డీ స్కీం .

ఎటిఎం స్కీం - ఎవరికన్నా ఎటిఎం కార్డు కావాలంటే - వారి ఆర చేతి మీద " ది బ్యాంకు అఫ్ అమరావతి - ఎటిఎం - విత్ డ్రా లిమిట్ 10 టూ 500 " అని ఒక పెన్నుతో రాసి కిందన ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి మా సంతకము చేస్తాము. పులకరించి పోతాము .
ఈ ఏటీఎం కార్డు కలిగిన వారు రాత్రి ఏడూ మరియూ ఫది గంటల మధ్య మా దెగ్గరికి వచ్చి ఆ చేయి చూపించి కావాల్సిన సొమ్ము విత్ డ్రా చేసుకోవచ్చు .ఇలాంటప్పుడు మేము సహజంగా యాభై రూపాయలు ఇస్తాము అంటాము. "కాదు కాదు-- మాకు ముందుకు తక్కువ పడ్డాయి మీరు రొండు వందలు ఇవ్వాలి " అని వారు బ్రతిమాలుతారు . మేము ఇస్తాము .ఇట్లాగా మా చుట్టూ పక్కల మా విలువకూడా పెంచుకున్నాము . చేతుల మీద రాయించుకోవటానికి వచ్చేవారితో మా బ్యాంకు కిక్కిరిసి పోతూ ఉంటుంది .

చివరాఖరికి మేము లెక్కలు చూసుకుని - సాలుకు మూడు లక్షల నష్టము వచ్చి నది అని తేల్చుకున్నాము . అందరూ ఎగ్గొట్టే వాళ్ళే వుండరుకదా ? అందువల్ల తక్కువగానే నష్టము వచ్చినది . తక్కువ నష్టముతో - ఎక్కువ కాలక్షేపము పొందుతూ వుండటాన మేము మా బ్యాంకు ఆఫ్ అమరావతిని ఇంకా ఇంకా నడప తలిచాము .
మేము క్రొత్త పధకాలు ప్రవేశపెట్టినపుడు మీకు తెలియ పరుస్తాను . సండే చికెన్ స్కీం , మొక్కు కు రుణాలు , నైటీ స్కీం - అనేవి ప్రవేశ పెట్టాలని ఆలోచిస్తున్నాము . నైటీ స్కీం లో - మా పొరుగింటి అవిడ నెల రోజుల బట్టీ చీరలోనే ఉంటుంది - నైటీ వాడలేదు " అని ఒక మహిళా ఇంకో మహిళా గురించి రెకమండ్ చేస్తే - మేము వారికి "వన్ గ్రేమ్ గోల్డ్ " నగలుకొనుక్కునేందుకు " పైసా వడ్డీ మీద రుణాలు ఇస్తాము . అదన్న మాట .
ఇట్లు ది చీఫ్ మేనేజర్/ లోన్స్-- ది బ్యాంకు అఫ్ అమరావతి -

పిచ్చి ప్రేమ లు **..16-12-23**

కిటికీ పక్కాగా వేసుకున్న పడక కుర్చీలో పడుకొని వున్నాడు బుచ్చి బాబు. మూడు రోజులుగా అతడు అట్లాగే పడుకొని ఆలోచిస్తూ వున్నాడు అనుకోకుండా జరిగిన ఒక ఆక్సిడెంటులో అతడి కాలు విరిగింది . ఎటూ కదలలేక అతడు కిటికోలోనుండి కనపడిన మేరకు చూస్తూ , భవిష్యత్తు ను గురించి చింతిస్తూ వున్నాడు . అది చాలించుకున్నాక, ఎప్పుడో ఒకసారి చదివి పడేసిన కథల పుస్తం ఒకటి చేతపట్టి ఒక కధ మరలా మరలా చదివాడు . "తల్లుల శక్తికి మేర అనగా హద్దు అనేది లేదు " అనేది చెప్పటం తో ఆ కథ ముగుస్తుంది .
ఆ కథలో ఇట్లా ఉంటుంది . బర్రెలను పెంచి పాడి చేసి అమ్ముకొని జీవించే ఒక స్త్రీ ఉంటుంది .ఒకనాడు ఈ స్త్రీ వద్దకు ఆమె ఇంతకు మునుపెన్నడూ చూడని ఒక స్త్రీ వచ్చి ఒక గిద్దెడు పాలు పోయమని

అడుగుతుంది . అందుకు తగిన డబ్బులు లేవు అంటుంది . డబ్బుకు బదులుగా పాలు పోసే స్త్రీ యొక్క పశువుల పాకను శుభ్రం చేసి పెట్టి - పాలు పట్టుకు పోతుంది . ఇది మొదలుగా - అది వర్షం కానీవండి వరద కానీవండి ఆ స్త్రీ వచ్చి పశువుల పాకనుశుభ్రం చేసి పాలు పట్టుకు పోతూ ఉంటుంది . తాను పోసిన పాలకు సరిపడా తనకు ఆమె పని చేసి పెడుతున్నాడా ? లేదా ? అని పాలు పోసే స్త్రీ ఆలోచిస్తూ ఉంటుంది . దానితో పాల కోసం వచ్చే స్త్రీకి మరిన్ని పనులు పురమాయించుతూ ఉంటుంది

.ఒకనాడు ఈ పాలు అమ్మే స్త్రీ తన ఆసక్తిని అణుచుకోలేక - పాలు పోయించుకొని పెడుతున్న స్త్రీని అనుసరించి పోయి చూస్తుంది . ఆ స్త్రీ వెళ్ళీ వెళ్ళీ ఊరి చివరన పొలాలలో వున్నా ఒక సమాధిలో దూరి పోతుంది . ఈ స్త్రీ వెనక్కి వచ్చి - ఆమె ఒక దయ్యమని - ఆమె తన మీద కోపముతో తనను ఏమైనా చేయవచ్చునని భయ పడుతుంది . అందువల్ల మరునాడు ఆ స్త్రీ పాలకోసం రాగానే ఆమెకు నమస్కరించి " అక్కా ఇంకొన్ని పాలు ఎక్కువ పోయానా ? ఎవరికోసం ఈ పాలు తీసుకు పెడుతున్నావో ఏమో . మరికొన్ని పోస్తాను . నీవు నాకు ఏమి పనీ చేయవద్దులే . నా అక్కవి అనుకుంటాను " అని అనునయంగా మాట్లాడుతుంది .

" సరే చెల్లీ - నా చెల్లికి అయితే నేను పనులు చేసిపెట్టానా ? నువ్వు చెప్పిన పనులు నాకు ఎదురవుతున్న కష్టం కన్నా ఎక్కువ కష్టమైనవి కాదు .ఎప్పటికన్నా కాసిని ఎక్కువ పాలే పోయి . ఎందుకంటే బిడ్డడు పెరిగి పెద్ద అవుతున్నాడు " అంటుంది .

వారిద్దరి మధ్యా జరిగిన సంభాషణ ప్రకారం - ఈ పాలు తీసుకునే స్త్రీ , ఒక బిడ్డకు జన్మ నిచ్చిపురిటిలోనే చనిపోతుంది .ఆ పై ఆత్మగా మారుతుంది . ఇప్పుడు ఆ చంటి బిడ్డ సరైన ఆలనా పాలనా సరిగా లేక పాలకై అలమటిస్తూ వున్నాడు. అందుకని ఈ తల్లి ఆత్మ ఈ రకంగా

పాలు తీసుకు వెళ్లి పిల్లవాడికి అందచేస్తూ వున్నది . " తల్లుల శక్తికి మేర అనగా హద్దు అనేది లేదు " అనేది చెప్పటమే ఈ కధ ఉద్దేశ్యము కాబట్టి - "ఆ తల్లి ఆత్మ ఇన్ని పాట్లు పడటం ఎందుకు ? ఏవైనా మహిమలు చూపించ వచ్చును కదా" అన్న మీ ప్రశ్నకు సమాధానము లేదు .

బుచ్చిబాబు అట్లా చూస్తూ ఉండగానే - ఒకనాడు చెట్టు మీద నున్న గూటిలోనుండి ఒక పక్షి పిల్ల జారి నేలను పడ్డది . పడి ఎగరలేక పోయింది . అందుకని అట్లాగే పడివుంది . వాళ్ళ మనుమడు ఎంతో దుడుకు వాడు - వచ్చి , ఆ పక్షి పిల్ల కాలికి ఒక గట్టి దారం కట్టి దాన్ని ఓ చిన్న మొక్కకు కట్టి వేసాడు . ఇంట్లో కెళ్ళి ఏవో తెచ్చి దాని ముందుచల్లాడు . తినూ అన్నాడు .ఇదీ ఒక ప్రేమే కదా ?
కుర్చీలో పడున్న వాడికి ఒక ముద్ద తెచ్చి పడేయటం ప్రేమ కాదా ?
ఇంతలో ఆ పక్షి పిల్ల తాలూకూ తల్లీ తండ్రీ పక్షులు వచ్చాయి . తమ బిడ్డను గమనించాయి .
ఆ వెంటనే తండ్రి పక్షి వెళ్లి ఎదో పురుగును నోట కరుచుకు వచ్చింది . నేల మీద పెట్టింది . తల్లి పక్షి ఆ పురుగును ముక్కున కరిచి మూడు ముక్కలు చేసింది . ఒక ముక్కను ముక్కుతో పట్టుకొని తన పిల్ల పక్షి వద్దకు చేరి తన ముక్కుతో ఆ పురుగు ముక్కను బిడ్డ ముక్కుకు అందించింది . ఆపై సంతోషంగా రెక్కలు కొట్టుకుంది . పిల్ల పక్షి కూడా తెప్పరిల్లుకుంది . తల్లి పక్షి చూపిన ఆ పిచ్చి ప్రేమ బిడ్డ ని విడిపించలేదు . కానీ ఎంతో మనో నిబ్బరాన్ని ఆత్మా స్తైర్యాన్నికలుగ చేసి ఉంటుందనటంలో సందేహం లేదు .
"తల్లి తండ్రుల ప్రేమలు పిచ్చి ప్రేమలు . నాకు కారు ఆక్సిడెంట్ అయినాక -- నన్ను కదల కుండా కూచో పెట్టి నా భార్యా పిల్లలు చూపే ప్రేమవేరు . ముదుసలివారై కూడా - నాకోసం అని పడుతూ లేస్తూ వచ్చిన నా తల్లి తండ్రీల యొక్క ప్రేమవేరు . వారు తెచ్చినది నేను తినటం చూసి వారు పొందిన ఆనందం వేరు . వారి ప్రేమల రుచియే అమృతం అయ్యి

ఉంటుంది . నేను పెట్టినది తింటే నా బిడ్డడు కోలుకుంటాడు అని నా తల్లి అనుకోని ఉంటుంది. నిజమే ఆమె శక్తికి మేర లేదు ; ఆ ప్రేమ ఇచ్చే నిబ్బరము మనః శాంతి ఇంకే ప్రేమ ఇస్తుంది ? ఈ ప్రేమల తో నేను త్వరలోనే కోలుకుంటాను. నేను ఎవరికో ఒకరికి , దేనికో దానికి , ఎందుకొకందుకు, ఏవో కొన్ని పరిస్థితులకి బందీలుగా మారినపటిక్కీ గూడా - నా తల్లి తండ్రులువచ్చి ఈ పిచ్చి ప్రేమలు చూపించకుండా బ్రతకలేక పోయారు .అవియే నాకు భగవంతుని అస్సీసులు " అని అనుకుంటూ బుచ్చి బాబు ఇంట్లోకి కేకవేసి "ఇటొచ్చి ఆ పక్షిని విడిచిపుపుచ్చన్ది - దాని అమ్మా నాయినా వచ్చినారు " అన్నాడు . తాను అన్నది ఎవరూ పట్టించుకోక పోతే - - పాక్కుంటూ వెళ్లి అయినా సరే తానే ఆ పని చేద్దామని కూడా బుచ్చిబాబు అనుకున్నాడు . అతనిలో పిచ్చి ప్రేమల పట్ల ప్రేమ మొదలైంది .

—------------------------------------------------------------- .

పందుల పెంపకం **10-12-23..**

ఇదివరకు అనగా **1980** ప్రాంతాలలో - టీవీ యాంటెనాని అటూ ఇటూ తిప్పి చివరికి ఎట్లగొట్లాగా టీవీ సిగ్నల్ అందుకొని టీవీ ప్రోగ్రాం చూడటానికి కూచునే సరికి - పందుల పెంపకం గురించి కార్యక్రమం ప్రసారమయ్యేదని అనేక మంది అంటారు . నేనూ చూసాను . బాగా ఆలోచిస్తే , అప్పటిలో పందుల పెంపకం ఒక పనికొచ్చే విషయము అయ్యి ఉండవచ్చు . అందుకనే దాన్ని అలాగా ప్రసారం చేసి ఉండవచ్చు .

ఇప్పుడు ఈ **2023 -24** లలో నేను బాగా అలోచించి ఏమి తెలుసు కున్నాను, అంటే **2035** తరువాత నుండీ మీరుమరల " పందుల పెంపకము" అనే కార్యక్రమము చూస్తారు .ఇదేదో ఉపయోగంగా

ఉందని అలోచించి, మొదట వద్దు వద్దు అన్న   అదే పందుల పెంపకం కార్యక్రమాన్ని మరలా మరలా  కూడా చూస్తారు .
తొందరలో ఫాసిల్ ఫ్యూయల్స్ అనగా పెట్రోల్ డీజిల్ వంటి వాటి సరఫరా అడుగంటి పోనుంది .
ఇక ముందు దొరికేది కాస్తా మిలటరీ విమానాలకు ,చంద్రమండలం పోయే రాకెట్లకు కావలి .
ఎలెక్ట్రిక్ బ్యాటరీతో నడిచే బస్సు ను తయారుచేస్తే అందరూ ఎక్కుతున్నారు . కానీ ఎలెక్టిక్ బ్యాటరీ తో నడిచే బోయింగ్ విమానాన్ని తయారు చేస్తే ఎవరు ఎక్కుతారు ? దాంతో పౌర ప్రయాణీకుల విమానాలకు కూడా ఈ ఇంధనమే కావలి కదా ?
అందువల్ల ఇంకా ఇంకా కొంతకాలం పాటు పాసెంజర్ విమానాలు పెట్రోల్ఆధారిత  ఇంధనంతో నే నడప వలసి వస్తుంది . ఇలా టి  తప్పని సరి పరిస్థితి ఎదురు కావటం తో శాస్త్రవేత్తలు బాగా అలోచించి - పరిశోధించీ , విమానాల్లో  పెట్రో ఇంధనాలకు  బదులు - పంది కొవ్వును వాడ వచ్చునని కని పెట్టారు. మనకు తెలియక పోయినా , ఇప్పటికే, విమానపు ఇంధనములో మూడు శాతము వరకూ  పందికొవ్వు నుండి వచ్చిన నూనెను కలిపి విమానాలను నడిపిస్తూ వున్నారు .ఇట్లాగా చిన్న మొత్తములో ఇంధనం ఆదా చేయటం మొదలెట్టారు .
ఈ మూడు  శాతాన్ని  ముప్పై వరకూ పెంచే వీలుంది అని కూడా అన్నారు . విమానాల సంగతే ఇట్లా ఉంటే నేలమీద తిరిగే లారీలకు కూడా పంది కొవ్వు నూనెను వాడకుండా ఆగుతారా  ?

అందువల్ల రానున్న రోజుల్లో పంది కొవ్వు నుండి నూనెను విడదీసి దాన్ని ప్రాసెస్ చేసి అమ్మే అనేక పరిశ్రమలు పుట్టుకు రానున్నాయి . వారికి రోజుకు లక్షలలో పందులు కావాల్సి వస్తాయి.  మరి ఎవరూ పెంచకుండా పందులు ఎక్కడ నుండి వస్తాయి .ఎట్లా పెరుగుతవి ?

ఇదే మంచి సమయము అని, మీరు కనుక పందుల పెంపకం చేపడితే ఇక ముందు ముందు మీకు కనక వర్షమే .మీరు దుబాయి ఆయిల్ సెట్ లాగ బ్రతక వచ్చు . మీరు పందుల పెంపకం గురించి పెద్ద పెద్ద చదువులు చదువుకుంటే - మీకు పందుల ఆయిల్ కంపెనీల్లో మంచి ఉద్యోగాలు దొరుకుతాయి . చదువు రానివారికి కూడా పందుల కంపెనీల్లో అవేవో క్లీనింగ్ జాబ్స్ కూడా దొరుకుతాయి- దానికేమీ ఢోకా ఉండదు , **2030** తరువాతనుండి పందుల పెంపకమే ముఖ్య వృత్తి అవుతుంది అనుకుంటూ - ఇప్పటినుండే ఆ చదువు మీద ధ్రుష్టి పెట్టండి . క్రమంగా పంది ఆయిల్ తో నడిచే బైక్ లు గూడ వచ్చి - ఆ ఆయిల్ పోసే పెట్రోల్ బంకుల వంటివి కూడా వస్తాయి . అదే సమయంల పందుల పెంపకపు ప్రోగ్రాములు కుప్ప తెప్పలుగా మీకు చూపిస్తారు - మీరు ఆదరిస్తారు.

—-----------------------------------------------------------------

అవునూ ఆమె ఏమైంది ?

మీకు సస్పెన్స్ కథలు ఇష్టము అని తెలుసు . ఇది చదివి చూడండి .

ఎదో ఒక ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమము జరుగుతున్నది .ఆ ఉద్యమము ముందు వరుసలో
బెజవాడ అపరాజిత ,అనే ఆమె పెద్ద జెండాను మోస్తూ - బొబ్బులిలా గర్జిస్తూ నినాదాలు ఇస్తూ వున్నది . అప్పుడు ఆమె వయసు ముప్పై లోపే . అందువల్ల ఆ అరుపులకు పోలీసు వారు చెవిపోటుతో దద్దరిల్లారు . ఇక తట్టుకోలేక ఈమె పైకి స్త్రీ పోలీసులను పంపి ఆమెను అరెస్టు చేసి స్త్రీ పోలీసు స్టేషన్ కి తరలించారు . ఏది ఏమైనా కానీ బెజవాడ అపర్ణ బాగా పద్ధతి కల మనిషేను. పైగా బ్రాహ్మణి .
మరు నాడు ఉదయము స్టేషన్ లోనే వున్నా మురికి గది లోకి వెళ్లి - అక్కడనే తల నిండా స్నానము చేసి - నీరు కారుతున్న బట్టలతో

బయటికి వచ్చి నది .   వచ్చి స్టేషన్ అధికారి స్టేషన్ లో పెట్టుకున్న అమ్మవారి ఫటానికి నమస్కారము చేసి , ఆపై పద్మాసనం వేసుకొని కూర్చుంది. మీరు అనుకున్నట్లు ధ్యానము అదీ ఏమీ లేదు  .వూరికే కూచుంది అంతే .

అది మహిళ ల పోలీసు స్టేషన్ కాబట్టి దాని కి ఒక మహిళ  ఏ అధికారిణీ . ఈమె కూడా పద్ధతి గల మనిషేను . శుక్రవారం సందర్భంగా తల నిండా స్నానం చేసి కురులు ఆరపెట్టుకొని , తల నిండా పూలెట్టుకొని పోలీసు రంగు పంజాబీ డ్రెస్స్ వేసుకొని స్టేషన్ కి వచ్చింది .ఆమె ఐ పీ ఎస్ ద్వారా  పోలీసు అధికారిణి ఐయ్యింది .  ఐ పీ ఎస్  ఆమె కాబట్టి ఆమె భవిష్యత్తులో ఏదైనా అవవచ్చు . అందువల్ల ఆమెను ఆక్షేపించే సాహసం ఎవరికీ లేదు . ఆమె చేసేది చూస్తూ ఉన్నటం తప్ప .
మన పోలీసు అధికారిణి పేరు " శాంభవీ సిన్హా " నార్త్ ఇండియన్ . శాంభవీ సిన్హా వచ్చి అంబ పటానికి దణ్ణం పెట్టుకొని మన  "బెజవాడ అపరాజిత" యొక్క సెల్ తలుపులు తెరిచి - ఆమెను బయటికి తీసుకొచ్చి తన ఎదురుగా వుండే సీటులో కూచో బెట్టుకుంది . ఈ బెజవాడ అపరాజిత  నేరము తృణపాయము వంటిది అని " శాంభవీ సిన్హా "అభి ప్రాయ పడింది .  అందుకని " "బెజవాడ అపరాజిత"కూచున్న చోట వున్నా ఫాను వేసింది .  ఇంటి నుండి ఒక కొత్త కాటన్ చీర, , కుంకుమా , దువ్వెనా పూలు  తెప్పించి మన " అపరాజిత" కి ఇచ్చింది .  లంచ్ టైంకి  శాంభవీ సిన్హా   కోసమని ఇంటినుండి క్యారేజీ వచ్చింది . ఆమె దాన్ని రొండు సగాలు  చే సి ఒక సగాన్ని విస్తరాకు ప్లేటులో వేసి మన అపరాజిత కు  ఇచ్చింది  . ఇద్దరూ ఏమీ మాట్లాడు కోకుండా తినేశారు . అందువల్ల ఎవరి మనసులో ఏమి భావాలు ఉన్నాయో ఎవరికీ తెలియ రాలేదు .
తరువాత " పోలీసు వారిని గడగడా లాడించిన వనితగా"   బెజవాడ అపరాజిత   పార్టీ వారి నుండి ఎంతో గుర్తింపు పొందింది . ఆపై క్రమంగా ఎం ఎల్ ఏ అయి  - ఎంపీ అయి- ఒకనాటికి ముఖ్య మంత్రి పీఠం ఎక్కింది

. ఆమె ఆంధ్ర దేశానికి మొదటి మహిళా ముఖ్య మంత్రి అయింది
అన్నారు .
ఒకనాడు-- " ఆ శాంభవి సిన్హా నాలో కాబోయే ముఖ్యమంత్రిని చూసింది
. ఇప్పుడు నేను ఆమె దూరద్రుష్టిని గౌరవించాలిసిన సమయం వచ్చింది"
అనుకున్నది మన "బెజవాడ అపరాజిత" గారు
స్టేషన్ లన్నింటిలోనూ ఇంక్వైరీలు జరిపించింది . ఏమీ ఆచూకీ దొరకలేదు
.కారణం కొన్ని చోట్ల రికార్డులు గల్లంతు అయ్యాయి .

"అవునూ ఆమె ఏమైంది ?" అని మన "బెజవాడ అపరాజిత" కనపడిన
ప్రతి ఐజీ ని అడిగింది .డీజీని అడిగింది
వాళ్ళందరూ కూడా మా వల్ల కాదు అని చెప్పలేక , ఏవో ఏవో చెప్పారు .

అవునూ ఆమె ఏమైంది ? అన్న విషయము మీకైమైన ఊహకు
అందిందా ? . ఏమయిందో ఏమో తెలియక పోయినా-- ఆమెకు కూడా
ఎదో పెద్ద మంచి జరిగి ఉండవచ్చు అని మీకు తోచు.
మీకు ఏమి తోచిందో చెపితే ఈ సస్పెన్స్ కధలోని సస్పెన్స్ వీడి పోతుంది .

—---------------------------------------------------------------

ఏజెంట్ - ఆరెంజ్ గోపీ **7-12-23**

నా పేరు గోపీ . నా సీక్రెట్ పేరు ఆరెంజ్ . నేను ఉండేది సీక్రెట్ .
నేనుచేసేది సీక్రెట్ . నేనుచెప్పేది సీక్రెట్ . రిటైర్ అయి వున్నాను అన్నది
ఒక్కటే సిక్రెట్ కాదు .
ఒక నాడు నేను ఎదో టీవీ ఛానెల్ చూస్తూ వున్నాను

" ఏజెంట్ ఆరెంజ్ వల్ల మాకు జరిగిన నష్టానికి గానూ మీరు నష్టపరిహారం చెల్లించాలి " అంటూ కొందరు వియత్నామీస్ ప్రజలు అమెరికన్ ఆంబసీ ని ముట్టడించినట్లు ఒక నిముషం పాటు వార్తలు చూపారు .
" ఏందీ విచిత్రం . ఏజెంట్ ఆరెంజ్ అన్న మారు పేరుతో నన్నే కదా పిలుస్తారు . మరి నేనెప్పుడూ వియాత్నం పోయింది లేదు-- ఎవరికీ అపకారం చేసిందీ లేదు .నేనేదో నష్టం చేశానని దానికి ఎదో నష్ట పరిహారం కావాలని వాళ్ళు పోయి అమెరికా వాళ్ళను అడగటం ఏందీ బాబూ ?"అని ఆందోళన పడ్డాను . అప్పుడు నాలోని సీక్రెట్ ఏజెంట్ నిద్రలేచి ఇలా కనిపెట్టాడు .
1962 టూ 1971 మధ్య కాలములో అమెరికా వియత్నాం లో యుద్ధము చేస్తూ ఉండేది . తనకు ఇష్టం లేని వారు రాజ్యం చేస్తున్నపుడూ - తనకు ఇష్టం ఐన వారిచేత రాజయం ఏలించటానికి అని , అమెరికా కొన్ని దేశాలలో యుద్ధాలు చేస్తూ ఉంటుంది . ఈ సందర్భంలో వియత్నాం గవర్నమెంట్ అమెరికా వారికి వత్తాసుగా ఉండి- మా దేశంలో కొందరుతిరుగు బాటు దారులు వున్నారు వారిని పెరిపేయండి " అని అమెరికాని అడిగింది.అప్పుడు ఒక యుద్ధము మొదలైంది . దీని నుండి అమెరికా ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నదని గిట్టని వారు అంటారు . ఈ యుద్ధములోనే ఏజెంట్ఇ ఆరెంజ్ అనేవాడు పాల్గొన్నాడు . "ఏజెంట్ ఆరెంజ్ "అనేది ఈ యుద్ధము లో వాడబడిన ఒక విష రసాయనం . దీన్ని ప్రయోగించి మామూలు యుద్ధము ను ఒక రసాయనిక యుద్ధము , అనగా కెమికల్ వార్ ఫేర్ గా, మార్చారు అమెరికా వారు .

"ఏజెంట్ ఆరెంజ్ " అనే ముద్దు పేరుతో పిలవబడే 76,000,000 లీటర్లవిష రసాయనాన్ని -- వియాత్నాం మీద అమెరికా వెద జల్లింది . ఇది ఆకాశములో పరుచుకుంటూ వచ్చి , పచ్చని చెట్టు లేదా మొక్కలమీద పడినపుడు -- ఆ చెట్టు మల మ లా మాడి

చనిపోతుంది .ఈ ఏజెంట్ ఆరెంజ్ వల్ల వియత్నాం లోని పొలాలు , అడవులు , కొండల మీద వుండే పచ్చ దనము మొత్తముగా **31,000 km2** మేరా నశించి పోయింది .
పొదల్లోని కుందేలును పట్టాలంటే పొదను కాల్చి భస్మం చేయటమే మార్గము అని యుద్ధ నీతి **?**
వియత్నాంలో అమెరికాకు శత్రువులు గా వున్నవారు పంట పొలాల్లో నూ , కొండల్లోను గుట్టల్లోనూ , అరణ్యంలోను దాక్కొని వుంటున్నారు. వారిని చెట్ల మాటునుండీ బయటకు లాగటానికి అని.అమెరికా - తన ఏజెంట్ ఆరెంజ్ ని వుపయోగించింది .

అమెరికా పెదజల్లిన, ఏజెంట్ ఆరెంజ్ వల్ల వియాత్నంలోని పర్యావరణం బాగా విషపూరితమైంది . ఇక వియత్నమ్ యొక్క ఆకాశం కింద- తమ శత్రువులను వెతుక్కుంటూ అమెరికాసైనిక వర్గాల వారు కూడా వున్నారు కదా **?** పర్యావరణంలోకి ప్రవేశించిన విషము వారి మీద కూడా పని చేసింది . వారు యుద్ధము ముగించుకొని ఇంటికి తిరిగి వచ్చాక అనేక జబ్బులతో భాదపడుతూ మిలటరీసేవలకు పనికి రాక - రిటైర్ అయ్యారు . ఇలా రిటైర్ అయిన వారికి సంవత్సరానికి **40 ,000** డాలర్లనుండీ **42,**౦౦౦ డాలర్ల వరకూ నష్టపరిహారంగా -- ఇవ్వటం మొదలెట్టింది అమెరికా . అంటే అమెరికాయే తన తప్పు ఒప్పుకున్నట్లు అయ్యింది .

అమెరికాయే తప్పు ఒప్పుకొని నష్టపరిహారం చెల్లిస్తూ ఉండటం వల్ల - అంతర్జాతీయ సంస్థల వారు కలుగ చేసుకొని , వియత్నాం లోని ఏజెంట్ ఆరంజ్ భాదితులకు కూడా అమెరికా ఆర్థిక సహాయం అందించాలని ఒత్తిడి చేశారు . అప్పటినుండీ వియత్నాంవారు కూడా ఏజెంట్ ఆరంజ్ వల్ల జరిగిన నష్టానికి - నష్ట పరిహారము పొందుతున్నారు .

ఏజెంట్ ఆరంజ్ వల్ల ముప్పది లక్షలకు మంది పైగా జనం అవయవాలు చచ్చు పడి అంగ వైకల్యము కల వారిగా మారారు అని లెక్క . ఈ విష ప్రభావం వల్ల - వియత్నాంలో - మైండ్ ఊపిరి తిత్తులు , కాళ్ళూ చేతులూవంటివి సరిగా ఏర్పడని పిల్లలు అనేక లక్షల మంది పుట్టారు . వీరిని "జనం అని నమ్మటానికి వీలులేని జనము " అనే ఖాతా కింద జనాభా లెక్కలోకి తీసుకున్నారు .

తమ ఏజెంట్ , ఆరెంజ్ వల్ల జరిగిననష్టానికి -గానూ వియత్నాంలోని - రెండుతరాల ప్రజలవరకూ నష్టపరిహారం అందిస్తానని అమెరికా ఒప్పుకున్నది . ఇచ్చింది కూడా .

" మా మూడవ తరము పిల్లల మీద కూడా ఏజెంట్ ఆరెంజ్ యొక్క విష ప్రభావం పడుతున్నది . కాబట్టి మీరు మా మూడో తరము నాకు కూడా నష్టపరిహారం ఇవ్వండి " అని
మూడో తరాన్ని కన్న రెండో తరం వియత్నము ప్రజలు అమెరికన్ ఎంబసీ దెగ్గరకు వచ్చి ఆందోళన చేశారు . అదే నేను చూసిన వార్త .

నా పేరు ఈ దేశంలో "ఏజెంట్ ఆరంజ్" కాబట్టి , మీరు నాగురించి ఏదో చెడు అనుకుంటారన్న భయంతో - ఇదంతా మీకు తెలియచేసాను .

ఈ ఏజెంట్ ఆరంజ్ అనేవాడే కాక **- , Agent White, Purple, Blue, Pink, and Green.** అనే పేరు తో మిలిటరీ లో పాల్గొనే రకరకాల రసాయనాలు కూడా వున్నవి, అని తెలిసి నేను ఇంకా భయపడ్డాను . వాటిని గురించి కూడా తప్పక వివరిస్తాను . మాకు ఆ సీక్రెట్ ఏజెంట్ల గురించి తెలుసుకోవాలని ఉందిఅని మీరు అంటే

మాలాంటి సీక్రెట్ ఏజెంట్ వద్ద ఎన్నో విషయాలు ఉంటాయి - ఒకటి వినండి - "ఎకో ఫ్రెండ్లీ గా వుండండి - పర్యావరణాన్ని కాపాడండి " అని అగ్ర దేశాలు తరచూ పిలుపు ఇస్తూ ఉంటాయి . పర్యావరణాన్ని కాపాడే స్వచ్ఛంద సంస్థలకు నిధులు కూడా ఇస్తూ ఉంటాయి . పార్యవరణం మీద ప్రేమతోనే వారు ఈ నిధులు ఇస్తున్నారా ? అనే ప్రశ్న వేసుకుందాము . కాదు అన్నట్లు దానికి ఒక సమాధానము దొరికింది . యుద్ధంలోను , యుద్ధము లో పాల్గునే దేశాలవల్లనే ఎక్కువ పర్యావరణ నష్టము జరుగుతూ ఉంటుంది . అగ్రరాజ్యములు ఏజెంట్ ఆరంజ్ వంటి విష రసాయనాలను స్ప్రే చేసినపుడు ఆ ప్రాంతాలలో వుండే పక్షులు - అంటే బ్రతికి బట్ట కట్టిన పక్షులు - తమకు ఎక్కడ సేఫ్ ఐన వాతావరణము ఉందొ అనేది వెతుక్కుంటూ అనేక దేశపు నదులూ సరి హద్దులు దాటి వాటికిష్టమైన చోట వాలి అక్కడనే జీవించటం మొదలెడతాయి . యుద్ధము జరుగుతున్న దేశములో వున్నా ఒక పక్షి ఇటు అమెరికాకు- అటు రష్యాకు - ఏటో ఒకటని చైనా కు కూడా పోవచ్చును .కానీ అప్పటికే గాలి లోని విష రసాయన ప్రభావము ఈ పక్షులరక్తములోకి ఎక్కివుంటుంది కదా ? . అందువల్ల, అవి విడిచిన మల మూత్రాలు నదులలోకి నేల మీదకు పడి , ఇవి చని పోయినపుడు వీటి మృత కళేబరాలపై వాలిన క్రిమి కీటకాలు ఈగలు దోమలు వంటి వాటివలన కొత్త కొత్త వైరస్లు లు, వైరస్ వ్యాధులు పుట్టి వ్యాప్తి చెందుతూ ఉంటాయి . అది కరోనా వంటి వైరస్ అయితే ఎంత డామేజీ చేస్తుందో ప్రపంచం అంతా చూడనే చూసింది .

అందువల్లనే అగ్ర దేశాలు మీరంతా ఎకో ఫ్రెండ్లీ గా వుండండి అని ఇతర దేశాలకు పిలుపు ఇస్తూ ఉంటాయి .

దీని అర్ధం ఏమిటంటే " మీ దేశములో అన్ని మూలలా పచ్చదనం ఉంచుకోండి . ఒక వేళా మేము వచ్చి ఒక మూలనున్న పచ్చదనం నాశనం చేస్తే అక్కడి పక్షులు మీ దేశము లోనే వున్నా మరొక మూలకు పోయి బ్రతికే వీళ్ళు మీరే కల్పించాలి. వాటికి మాదేశం రావాలన్న

ఆలోచన కలిగించవద్దు.   " అని చెప్పినట్లు . మీరు ఎకో ఫ్రెండ్లీ వుండాల్సింది దీని కోసమే కానీ మరొకందుకు కాదు  .  సాయాలు అందేది కూడా అందుకోసమే .

----------------------------------------oo---------------

"ఏజెంట్ ఆరంజ్"  అనే కెమికల్ ని తయారు చేసి ఇచ్చిన "డౌ"  అనే అమెరికన్ కంపెనీ ఇచ్చిన స్టేటుమెంట్ చదవండి . నా పరిశోధనల్లోని నిజం మీకే భోద పడుతుంది "   **Dow has great respect for the men and women who served in the Vietnam War and the others who were affected by it. The U.S. government bears the responsibility for its own military actions, including the development and use of Agent Orange in Vietnam.**

**Dow also firmly believes that historic wartime issues, including the use of Agent Orange, are appropriately a matter of resolution by the governments of the United States and Vietnam. The U.S. government has committed resources to address this issue and collaboration between the U.S. and Vietnamese governments continues on a number of fronts."**

ఇట్లు మీ మీ సీక్రెట్ ఏజెంట్  వా రణాసి శ్రీ రామ కృష్ణ

మా ఊరి బడిలో .. మీరో  సారి   **2-12-23**

మా వూరు అమరావతి . అక్కడిదీ ఈ  వీధి బడి . ఇది ఒక మాజీ జమీందారుగారి  బంగ్లాలో  ఉంది. దానిలో ఒక గది - జమీందారు దృష్టిలో చాలా చిన్నది - అంటే కనీసం యాభై అరవై మంది పట్టేది ఉంటే -

దాన్ని ఆయన మా బడికోసం ఇచ్చారు . ఇంట్లోనే బడి అవటం వల్ల ఒక్కో సారి జమీందారు గారి అమ్మాయి నో , అబ్బాయినో మాకు సహాధ్యాయులు అయ్యే అవకాశం కలుగుతూ ఉండేది . అచ్చు ప్రహ్లాదుడి చదువులా .అబ్బాయి గారు ఈ బడిలో చదవాల్సింది చదివి గుంటూరు పోయాడు ఇంగిలీషు బాగా చదవాలని .

ఒక సారి జమీందారు గారి అమ్మాయి గాయత్రీ దేవికి ఏమనిపించిందో ఏమో ? ఎదో లేడీస్ పండగ సందర్భంగా , వాళ్ళ నాన్నకు చెప్పి మా అందరికీ కంచు కమండలాలు ఇప్పించింది . మేము మంచినీళ్లు తాగటానికి అని . అంతకు ముందు అయితే మేము మంచి నీళ్లకు కృష్ణా నది దగ్గరికి పోయి తాగి వచ్చేవాళ్ళము . దగ్గరలో వున్నా బావిలో వున్నా నీరు తాగటం ఆనాటి మా ఆచారానికి పనికి రానందున . ఆ చెంబులు పట్టుకొని ఓ వరుసలో నడిచి వెళ్లి వస్తుండే వాళ్ళము . అప్పుడు మేము అచ్చు ఋషి పీఠం విద్యార్థుల వాలే ఫీల్ అవుతూ , ఆ కమండలం లో కృష్ణ నీరు ఆ చెంపబు యొక్క కొమ్ములోనుండి పీల్చి తాగుతుండేవాళ్ళం, ఇప్పటి పిల్లలలు వాటర్ బాటిల్ లోని నీళ్లు పీల్చి హ్యాపీ అయినట్లు . ఈ కమండలాలు ఇంటికి తీసుకు వెళ్లి తీసుకు రావటం ఎంతో దర్జాగా ఉండేది . కాగా మా ఇళ్లల్లోని పెద్దవాళ్ళు వీటిని కట్టా చేస్తూ ఉండటాన్ని - వాటిని ఇంటికి తీసుకెళ్లి తీసుకు రావటాన్ని అమ్మాయిగారు షేధించారు అమ్మాయి గారు . అటుపిమ్మట ఆ కమండలాను నిత్యమూ తళ తళ లాడేట్లు తోమించి - వాటిని తుడిచి భద్రపరిచి , మాకు అందించే ఏర్పాట్లు కూడా ఆ అమ్మాయిగారు చేయించింది . ఆ కమండలం ఇప్పటికీ మా ఇంట్లో ఎక్కడో వుంది . వెతికి తీస్తాను .

మా జమీందారు గారి అమ్మాయిది తరగతిలో మొదటి వరుస మొదటి సీటు అవకా తప్పదు కదా ? కానీ అప్పుడప్పుడు ఆమె లేచి వెళ్లి ,

వెనక వరుసలో కూచున్న మామూలు ఆడపిల్లల మధ్యన దూరేది . అప్పుడు వాళ్లలో వాళ్లే తెగ ముచ్చటలు ఆడేసుకునే వారు . వాళ్ళను భంగ పరచను మాస్టారి గారికి ధైర్యము ధైర్యము చాలని పని . పాఠము చెప్పటానికి కూడా ధైర్యము చాలేది కాదు అనుకోవాలి . అందుకని చెప్పిన పాఠాన్నే మళ్ళీ మళ్ళీ వల్లె వేస్తూ ఉండేవాడు . ముఖ్యంగా అందరికీ వచ్చిన రొండో ఎక్కమే తిరిగి తిరిగి చెపుతూ ఉండేవాడు . మేము ఎవరమూ వినాల్సిన పని లేదు .వింటున్నారా అని మమ్మల్ని గద్దించి అడగటానికి ఆయనకే వీలు లేదు . ఎందుకంటే రొండో ఎక్కములో మనమందరమూ అయన వంటి పండితులమే కదా ? . అందు వల్ల ఆ ఆడపిల్లల కబుర్లు చల్లగా వుండాలని మేము కోరుకునే వారము .

అమ్మాయిగారితో ముచ్చట్లు చెప్పుకోవటానికాని బడిలో చేరే ఆడపిల్లలు ఎక్కువయ్యారు . ఆలా అనుకోకుండానే , మా వూరిలో స్త్రీ విద్య ప్రోత్స హింప పడ్డది. ఇప్పుడు మీరు గుంటూరులో చూసే ప్రముఖ మహిళా వైద్యు రాళ్ళలో సగం మంది ఆ ప్రోత్సాహం లో పడి ఉత్సాహంతో ముందుకు కొట్టుకు వచ్చిన వారే.

" ఇంట్లో పాఠాలు చదువుకో రాలేదని పిల్లలని కొట్టవద్దండీ గురువు గారు " అని, ఒక నాడు జమీందారు గారి కూతురు పంతులుగారిని - కన్నీటితో ప్రార్థించింది .

" దండం దశ గుణం భవేత్ అన్నారు . కొట్టక పోతే చదువు రాదు . కొట్టే ముందు మీకు చెపుతాను మీరు కనులు మూసుకోండమ్మా " అన్నాడు మా పంతులు గారు .

" అట్లా కాదండీ . ఇంటి వద్ద పాఠాలు చదువుకో రాని వారికళ్లకు గంతలు కట్టి మన బడి వీధి వాకిలిన కూచ్చో పెడదాము, వారికి బుద్ధి వస్తుంది "అని ఆమె అన్నది . ఆ మరునాడు నిజంగానేఓ డజను వరకూ రంగురంగుల పట్టు కళ్ళ గంతలు తెచ్చింది . ఇంటి వద్ద పాఠం

చదువుకు రాని పిల్లలకు వాటిని కట్టి  బడి వాకిట్లో కూచో పెట్టారు . మీరు ఊహించే వుంటారు . రోడ్డు మీద ఎవరో పోతూ వుంటారు  లేదా ఏదో జరుగుతూ ఉంటుంది .  అలంటి వాటిని గుడ్లప్పగించి చూడటం దేముడు పిల్లలకిచ్చిన  ప్రాధమిక స్వేచ్ఛ.  అది కాస్తా పోయింది. అప్పటినుండి - ఇంటి వద్ద పాఠం బట్టీ వేసి , బడికి వచ్చి తిరిగి అప్పచెప్పేసి సాగరవంగా అటూ చూసే  విద్యార్థి / విద్యార్థినిలు ఎక్కువైనారు .ఈ మూలకంగా అందరికీ చదువు వంటపట్ట సాగినవి . ఆ రకంగా అమ్మాయిగారు విద్యారంగములో నూతన సంస్కరణలకు బీజం వేశారు .

ఈ అమ్మాయి గారి హయాములో  పరీక్షలో తప్పిన విద్యార్థులకు { ఎక్కాలు, ఏ బీ సి డీ లు ,  గుణింతాలు , కఠిన పదాలు, పెద్ద బాలశిక్ష లోని విషయాలు పలక మీద  రాసే పరీక్షలలో  }   సున్నాలు వచ్చిన విద్యార్థులకు} వుండే దండనలు అన్నీ రద్దు అయినవి ,
  ఇహ నూ  అన్ని దండనకు బదులుగా , ఒకే దండన  ప్రవేశపెట్టారు . అదేమిటంటే ? అమ్మాయిగానే స్వయంగాపూనుకొని పరీక్షలో తప్పిన వారి కను రెప్పల పైన దట్టంగా కాటుక పూసేది .  నల్లా నల్లని కండ్లతో నేను ఇంటికి వెడుతుండగా చూసిన వారు  ఏమిటి రా  అది ? అని అడిగి నపుడు " నేను  పరిక్ష తప్పాను అదీ సంగతి " అని వారికి చెప్పలేకనూ ఇంటికి వెళ్లి కుంకుడు రసంతో  కాటుకని  కడుక్కొని చావలేక నూ  , అవమానాన్ని దిగమింగుకోలేక నూ , నేను ప్రతి పరీక్ష కు బుద్దిగా తయారు అయ్యేవాడిని .ప్రతి పరీక్షా ప్యాసు అనిపించుకునే వాడిని . అమ్మాయి గారు పూనుకొని విద్యారంగంలో ప్రెవేశపెట్టిన ఈ నూతన సంస్కరణ నాకు ఎంతో ఇష్టమైనది . అప్పుడూ  ఇప్పుడూ  కూడాను , నేడు కూడా ఇట్లాంటి శిక్షలు ఉంటే ఉత్తమము . విద్యార్థులలో మానసిక పరివర్తన వస్తుంది .

పై మూలంగా నాలో పరీక్షలు ఎదుర్కోవాలి అన్న ధృడ సంకల్పము కలిగి - నేను ఉద్యోగార్థినై పోటీ పరీక్షలు నెగ్గిన దాకా కొనసాగింది .

ఇక చిన్నతనం బడి చదువుల్లో తాయిలాలు తినటమూ , పంచటమూ ఒక ముఖ్య ఘట్టము లేదా మధుర ఘట్టము . జేబీలో వున్నది తినకుండా - ఎవరికో తాయిలంగా ఇచ్చి సంతోషించటంలోనే పిల్లల కడుపులు నిండుతాయి , ఈ తాయిలాల పంపిణీలోనే స్నేహాలు కలుస్తాయి. విడిపోతాయి . జమీందారు గారి అమ్మాయి అంటే అందరికీ కావాల్సిన స్నేహితురాలు . ఒకసారి ఎవరికో ఆమె పెట్టిన తాయిలం అందక , వారు అమ్మాయిగారితో బహిరంగంగానే పచ్చి కొట్టారు . ఇలాంటి వాటిల్లో మొగపిల్లలకు లేని ధైర్యం ఆడపిల్లలకు ఉంటుంది . ఇలాగే ఇంకా ఎవరన్నా పచ్చి కొడతారేమోనన్న భయం చొప్పున - అంటే స్నేహ లు పోతాయేమోనని - అమ్మాయికి ఒక ఏర్పాటు చేసింది . మేము బడికి రాగానే జమీందారు గారి సేవకుడు ఒకడు ఒకడు తీపి కారపు తినుబండారాలు మా జేబులనిండా పోసేవాడు .మా జేబులు నిండాయా లేదా? అనేది అమ్మాయి గారు ఓ కంట గమనిస్తూ ఉండేది . జీవితానికి ఈ భరోసా చాలు అన్నట్లు ఉండేది మా పరిస్థితి . ఇది చాలదన్నట్లు ఆడపిల్లల కోసం అని ఒక సేవకి చేతిలో పెద్ద పళ్లెం దానినిండా తినుబండారాలూ పళ్ళూ పల హారాలతో గది బయట నిలబడి ఉండేది . పాఠం లో విరామం వచ్చినపుడు ఈ అమ్మాయిగారు - తన స్నేహితు రాళ్లను వెంటేసుకొని ఆసేవకి దగ్గరికి తనకు - వాళ్లకు కావాల్సినవి కావల్సినన్ని ఇప్పించేది . ఇటు తరువాత ఆడపిల్లలుఆమె చుట్టూ చేరి " రేపు ఏమి తాయిలం పెడతావబ్బా ? అని అడిగి స్నేహం ప్రకటించుకునే వారు . అట్లాగా అమ్మాయిగారు హంసల మధ్య రాజ హంస అయ్యింది .

హోదాలో మన కన్నా చిన్న వారితో అయినా సరే మనము స్నేహము సాధించవలె - ఎవరి చేతనూ పచ్చి కొట్టించుకో రాదు - స్నేహము అన్న

దాని రుచే వేరు అని నేనుఆ తాయిలాల పంపిణీ  నుండీ తెలుసుకున్నాను .

ఏదన్న తాయిలం అందుకున్నప్పుడు ఇచ్చిన వారు మన స్నేహితులవుతారు . స్నేహితుడిని ఎంత వారుకూడా మోసం చేయలేరు . అందుకే ఎన్నికలప్పుడు నాయకులు మనకు తాయిలాలు పంచి మనలను స్నేహితులుగా  మార్చుకుంటారు .

ఇలాంటి సంగతులు చాలా వున్నవి . గుర్తొచ్చినవి గుర్తొచ్చినపుడు రాద్దాము -- అన్నీ ఒక్కసారే ఎందుకు ? అన్నీ  కల్సి  పెద్ద పాఠము హోము వర్కుగా దొరికినట్లుగా  నట్లు వుండవొచ్చు నని నాకు తోచింది . తాయిలాలకోసమైన బడికి పోక తప్పదు కదా ? అందుకోసము అని అలా వెళ్ళొస్తాను సరేనా ?  - మీ బాల్య స్నేహితుడు వారణాసి శ్రీ రామ కృష్ణ